# కెరటాలు

కవితా సంకలనం

పి. కోటేశ్వరమ్మ

ఎం.ఎ., ఎం.ఫిల్

ప్రచురణ

**క్రాంతి-కార్తీక్ ప్రచురణలు**

ఆర్.బి.ఐ కాలని, విజయనగర్ కాలని

హైదరాబాద్.

**కెరటాలు** (కవితాసంకలనం)

- పి. కోటేశ్వరమ్మ



ప్రథమ ముద్రణ : 2003 ఆగష్టు

ప్రతులు : 500

ప్రతులకు : పి. రవీంద్రనాథ్
ఇం.నెం. 10-2-318/ఎ/సి/15,
ప్లాట్ నెం -19, ఆర్.బి.ఐ.కాలనీ
హైదరాబాద్-500 457

ముఖ చిత్ర రచన : శ్రీమతి ఎం.ఎ. వసంతరాణి., ఎం.ఏ
ఆరోగ్య ~~వైద్య~~ విద్యాధికారిణి
జిల్లా శిక్షణా బృందం; రంగారెడ్డి జిల్లా.

మూల్యం : రూ. 40/-

ముద్రణ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
40, ఎ.పి. హెచ్.బి. విద్యానగర్,
హైదరాబాద్-500 044
ఫోన్ : 27618261, 27653348

# అంకితం



'నా సహాయమును గానీ, సలహానుగానీ
కోరిన వెంటనే ఒసగెదను' అన్న మాటల్ని
అనుక్షణం నిలబెట్టుకుంటున్న నా ఆరాధ్య దైవం

**శ్రీ షిర్డీ సాయి బాబా**

దివ్య పాదాలని భక్తితో కడగటానికి
ఈ చిఱు కెరటాలు అంకితం

పి. కోటేశ్వరమ్మ

# మీకో మాట

అప్పుడప్పుడు నాలో చెలరేగిన భావోద్రేకాలు, హాబీలుగా వ్రాసిన కవితల సమాహార రూపమే ఈ "కెరటాలు" పుస్తక రూపం. 1974 సం॥ నుండి ఈ రోజు వరకు వ్రాసుకున్న కవితలు పుస్తక రూపం దాల్చడంలో ఆలస్యమే జరిగిందను కుంటాను. వృత్తి, ప్రవృత్తులకి ఏమాత్రం పొంతన లేకపోవడం, "కవితా సంకలనం" ముద్రిత రూపం మదిలో మెదిలినా కార్యరూపం తత్సారం జరిగింది. దాదాపు 3 దశాబ్దాల క్రితం వ్రాసినవి కావటం వలన భావంలో మార్పు లేకపోయినా భాషాపరమైన సవరణలు చేయాల్సి వచ్చింది.

జీవిత గమనంలో ఎన్నో సమస్యలకి షిర్డీ సాయిబాబా సమాధానాలు, జరుగబోయే సంఘటనల సూచనలు తెలుపడం వల్ల నాలో ఆస్తికత్వం పట్ల ఆశక్తి పెరగటానికి మూలమైంది. పెరిగిన వాతావరణం కూడా మరో బలమైన కారణం. ఈ భావజాలం వల్లే అంకితం బాబాకీయడం జరిగింది. ఆ వేదాంత ధోరణులే జాతీయత, ఓదార్పు, అనంతమీ కెరటాలు కవితల్లో కన్పిస్తే, నిరాశాధోరణులు శవోపదేశం, ఎంత దూరం కవితల్లో బయటపడ్డాయి. ప్రకృతినీ, కవిత్వాన్నీ మానవీకరించటం (పెర్సానిఫికేషన్) యాదృచ్ఛికంగా భావావేశంలో పెల్లుబికిన కెరటాలే.

ఇక ప్రత్యక్షదైవాలు అమ్మ, నాన్నల దగ్గర చనువెక్కువగా పెరగటం వల్ల వాళ్లతో ప్రతి విషయాన్ని క్షుణ్ణంగా వాదించుకుంటూ స్నేహంగా ఉండేదాన్ని.

అందుకే అమ్మ,నాన్న కవితలతోపాటు 1977లో అమ్మ మరణశయ్య మీద ఉన్నప్పుడు ఆసుపత్రిలో ఆవిడ మంచం ప్రక్కనే కూర్చుని భాదతో 'కోటి హృదయాలు' కవితా కెరటం ఎద చెలియలి కట్టని దాటి ఉపశమనం ఇచ్చింది.

ఒకే అభిరుచివున్న ఎం.ఏ. తెలుగు సాహిత్య విద్యార్థులమంతా యూనివర్శిటీ స్టడీటూర్స్ వెళ్ళినప్పుడు రైల్లో, ప్రయాణాల్లో సరదాగా శీర్షికలిచ్చుకుని ఆశువులుగా చెప్పిన మినీ కవితలకి తరువాత అక్షర రూపం కల్పించి ఆనందించినవి కళ్ళు, పల్లవి, సేద్యం, సరస్సు, నా కవిత, విధివంచితులు, అన్వేషణ మొదలైనవి.

దాదాపు అన్ని కవితలకీ శబ్దాలంకారాలకీ, మాత్రా ఛందస్సులకీ ప్రాధాన్యత ఇవ్వకుండా భావ వ్యక్తీకరణలో స్పష్టతకే ప్రాముఖ్యత నిచ్చాను. దీంతోకొన్నిసార్లు వచనంలా అనిపించినా, భావంలో స్వేచ్ఛకి తృప్తిచెందాను. కవిత్వం ఎట్లావుంటే బాగుంటుందో సుకవి (త)లో చెప్పాను.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, పౌర గ్రంధాలయ శాఖవారి సారధ్యంలో ఎం.ఫిల్ పట్టాకోసం వ్రాసిన "లఘు వీరగాథల్లో స్త్రీ విలువలు" అన్న నా సిద్ధాంత గ్రంథం వెబ్‌సైట్‌కి ఎన్నికైందన్న స్ఫూర్తి ఈ పుస్తకం ముద్రణకి నన్ను వెన్ను తట్టింది. మా శ్రీవారు శ్రీ పి. రవీంద్రనాథ్ గారు, మా అబ్బాయిలు చి॥ క్రాంతి కుమార్, చి॥ కార్తీక్ కుమార్‌లు ఈ సందర్భంలో ఇచ్చిన పూర్తి ప్రోత్సాహాలు ఈ విషయంలో నాకు చేయూత నిచ్చాయి.

శ్రీ కృష్ణ, సతీసక్కుబాయి మొ॥ పాత్రలకి జీవం పోసిన రంగస్థల నటీమణీ, శాస్త్రీయ నాట్యంలోనూ, గజల్స్ గానంలోనూ ఆరితేరిన డా॥ కె. రాజలలిత మేడమ్ గారు తమ అమూల్యమైన కాలాన్ని వెచ్చించి ఈ కవితలకి విమర్శ పలుకుల్ని అందించి నన్ను అభినందించినందుకు వారికి నా ప్రత్యేక కృతజ్ఞతాభివందనాలు తెలుపుకుంటున్నాను.

ముఖ చిత్రాన్ని అడగ్గానే భావయుక్తంగా అందంగా వ్రాసిఇచ్చిన మా సహోద్యోగి శ్రీమతి ఎం.ఏ. వసంతరాణి, [illegible] విద్యాధికారిణిగార్కీ, ఈ దిశలో ప్రోత్సహించిన బంధు. మిత్రులందరికీ, అందంగా ముద్రించిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్ వాళ్ళకీ నా కృతజ్ఞతాభివందనాలు.

**పి. కోటేశ్వరమ్మ**

# అర్ధభాగ ఎద కెరటాలు

**కో**టేశ్వరమ్మని 22-5-1985నాడు నా జీవితంలో అర్ధభాగంగా స్వీకరించాను. అప్పట్లో ఆమె ఉన్నత చదువునే చూసాను. కానీ ఎదలో ఒదిగివున్న కవితా భావ కెరటాలని చూడలేదు.

రాను రాను ఆ వెల్లువ గోచరమవసాగింది. భాదకానీ సంతోషం కానీ ఏ రకమైన ఉద్వేగాలకి లోనయినా కవన రూపంలో వ్యక్తపరచుకుని ఉపశమనం పొందటం ఆమె స్వభావంలోని సున్నితత్వాన్ని సూచిస్తుండేది.

మాది ఉమ్మడి కుటుంబం అవటం వల్ల, సభ్యుల మధ్య పరస్పరావగాహనా లోపాల వల్ల తరచూ దిగులుగా కనిపించేది. ఒక రోజు ఆమె చాలా భాద పడుతోందని గమనించాను. ఇల్లంతా వెదికినా ఎక్కడా కనబడలేదు. పైన మేడమీద వుండొచ్చని వెళ్ళి చూసి ఆశ్చర్యపోయాను. మేడమీద పడుతున్న, కొబ్బరి చెట్టు నీడలో ఏదో వ్రాసుకుంటూ కూర్చోవటం చూసి డిస్టబ్ చేయడమెందుకని మేడ దిగి వచ్చేశాను.

ఆ మనోవ్యధా సాగరంలో జనించిన ఓ ఆణిముత్యమే చలం గారిపైన నాటకీయ పక్కీలో వ్రాసిన రచన "చేమంతుల సంచలన కలం చలం" 5-3-1989లో ఉదయం దినపత్రికలో ముద్రితమైంది. దానిని ఇక్కడ అనుబంధంలో చేరుస్తున్నాము. అప్పుడప్పుడు ఇటువంటి మధనంలో నుంచి కవితలు పుడుతూనే వుంటాయి. ఇదీ ఆమె నైజం.

ఇక ప్రస్తుత 'కెరటాల'ని గమనిస్తే నాకు గోచరించిన అంశాలని వివరిస్తాను.

'జాతీయత' కవితలో దేశభక్తి అంతర్వాహినిగా ఎంత దాగివుందో దాదాపు అంతా 'ఆశ' కవితలోనూ ఉట్టి పడుతోంది. సంఘజీవి అయిన మనిషికి ప్రకృతిని మానవీకరించటం ఉగ్గుపాలతో పెట్టిన విద్య - ప్రకృత్యారాధన ఆది మానవుడి

నుండీ చేస్తూనే వున్నాము. ఇటువంటి మానవీకరణ (పర్సానిఫికేషన్) ధోరణులు కెరటాలు, అరుణోదయం, ఓ మనసా, పల్లవి మొదలైన కవితల్లో కన్పిస్తున్నాయి.

ప్రకృతే కాక కవిత్వాన్ని మానవీకరించటం కూడా అర్పణ, నేస్తమా, స్వప్నం, కళ్ళ (అ) వేదన మొదలైన కవితల్లో జరిగింది.

కెరటాలు వేటికవే వాటి వాటి స్థాయిల్లో ఎగిసిపడ్డా, చెలియలి కట్టని తాకినా, వెనక్కి వెళ్ళినా అన్నీ ఆ పయోనిధిలో అంతర్వాహినులుగానే ఎలా వుంటాయో ఈ 40 కవితా కెరటాలు కూడా దేనికదే ప్రత్యేకమైన సందేశాత్మకమైన ముగింపుతో వున్నా ఆద్యంతాల్లో ఆస్థికత్వం అంతర్నాడిగా కనిపిస్తోంది. 'అనంత మీ కెరటాలు' అన్న ముగింపు కవితలోనే పుస్తకం అంకితానికి అంతరార్థం కనిపిస్తోంది. కాసారంలో అలలకి అంతం లేనట్లే ఎదలోని ఊహా కెరటాలకీ అంతం వుండదు, తాను కోరుకున్నట్లే కవనం నిరంతరం సాగాలనే దీవిస్తాను.

ఇక చివరగా "నత్తనడక" అన్న కవిత్వంలో స్త్రీవాద ధోరణి (ఫెమినిస్టిక్ వ్యూ) ద్వారా నాకు ఒక చురక వేయకనే వేసింది. అయితేనేం అదీ ఓ సందేశంగానే తీసుకుందాం. పురుషాధిక్యానికి ఓ స్పీడ్ బ్రేకర్‌గా భావిద్దాం. పాజిటివ్ థింకింగ్ పెంచాలన్నదే ఇప్పటి ఆధునిక వాదన, అవసరం కూడా.

ఏది ఏమైనా నా అర్థభాగమైన శ్రీమతి కోటేశ్వరమ్మ వ్రాసిన ఈ "కెరటాలు" ముద్రితమవటం నాకు, మా బంధు మిత్రులందరికీ ఆనందంగానే వుంది. అందరి తరపున ఆమెకి మా శుభాభినందనలు.

**పి. రవీంద్రనాథ్**

# కెరటాలు - కవితా సంకలనం

రచయిత్రి శ్రీమతి పి. కోటేశ్వరమ్మ ఒక చక్కని భావ కవయిత్రి. ఇందులోని ప్రతి శీర్షిక ఒక ఆణిముత్యం. వీరి రచనలు చదువుతుంటే గొప్ప అనుభవజ్ఞురాలని తేటతెల్లమగును. విశాల భావ సరళత రచయిత్రి కవితలో చోటుచేసుకుంది. ఈ సంపుటి చదువనారంభింపగానే తుది వరకు ఆపకుండా చదువవలెనను జిజ్ఞాస రేకెత్తిస్తున్నది.

నాకు బాగుగా నచ్చిన కొన్ని కవితారస గుళికలు.

**'అమ్మ'** : కవితను, సహజత్వముట్టిపడునట్లుగా మాతృప్రేమను రంగరించి వ్రాసినారు.

**నాన్న** : "సంతానానికి స్థిరాస్తులివ్వలేదని మధనపడ్డారు. కాని తరగని సంస్కారాన్నిచ్చి మాలో మాకు అనుబంధం పెంచారు".

**ఓదార్పు** : "కరవాలం చిందించే రక్తానికన్నా నా కలం చిమ్మే మాధుర్యం మిన్న".

**కళ్ళ (ఆ) వేదన** : "వాల్చని కనురెప్పలు విప్లవానికి జోహార్లర్పిస్తున్నాయి.

**నేనూ వ్రాశాను** : "తలపెట్టిన పనులకు నిదానమే ప్రధానమని తెలుసుకున్నా".

**ఓ మనసా** : "మనసు మనసును ఆదరిస్తే ప్రణయం, ఆ మనసుల్ని మరేదో విడదీస్తే ప్రళయం".

**అనంతమీ కెరటాలు** : " ఏ 'ఇజం' వచ్చినా హ్యూమనిజం గొప్పదన్న బాబా బోధల్ని కొట్టేయలేవుగా".

**ఉగాది** : "ఎన్ని మారినా నిస్వార్థమైన కాలచక్రం ఆగదు".

"ఇవిగాక ఆశ, నా కవిత, చింత, నేస్తం, అర్పణ, స్వప్నం, కోటి హృదయాలు, సుకవి(త) ఎంత దూరం", అను కవితలు ఒకదానితోనొకటి పోటీ చేస్తున్నవా యని అనిపించును.

రచయిత్రి దాదాపు అన్ని విషయములు స్పృశించుటచే ఈ సంపుటి ఒక చిన్న విజ్ఞాన సర్వస్వమనుట అతియోక్తి కానేరదు.

కవయిత్రి ఇంకనూ అనేక కవితా సంపుటీలను వెలువరించవలెనని నా కోరిక. భావరంజితమైన కవితా ధనువుకు ఆహ్వానం.

శ్రీమతి కోటేశ్వరమ్మకు అభినందనలు.

**చిరునామా :**
ఇం.నం. 1-8-726/9,
బృందావన్ కాలనీ,
అచ్చయ్యనగర్, నల్లకుంట,
హైదరాబాద్-44.
ఫోన్ : 27668748

**డా॥ రాజలలిత**
ఎం.ఏ., బి.ఇడి, ఎం.ఫిల్, పి.హెచ్.డి
రిటైర్డ్ లెక్చరర్, తెలుగు శాఖాధ్యక్షురాలు
సరోజినీ నాయుడు వనితా మహావిద్యాలయం

# కెరటాల వాలు

# 1. కెరటాలు

నా మనసొక సంద్రం
ఓ నాడది పెను తుఫానుల అలజడి
మరోనాడు ప్రశాంత నిర్లిప్త కాసారం
ప్రతీరోజు ఎగిసిపడే కెరటాల కూడలే
ఉవ్వెత్తున లేచినా, వడిగా ఒకటి కొకటి గుద్దుకున్నా
మనో తీరం తాకినా-వెనక్కెళ్ళి ఎద చెలియలికట్టని
ముంచని హద్దుల్లో వుండే భావ కెరటాలవి

ఆ సాగర కెరటాల్లో ఉప్పు పుడితే
ఆ జలపాతాల్లో విద్యుత్తు వస్తే
ఆ సంద్రం సంఘాన్ని పోషించే కన్నతండ్రి

నా మనో సంద్రంలో జనించిన
ఈ కవితా కెరటాలు
సంఘం చిక్కుల్నీ, అంధవిశ్వాసాలనీ చెరిపేసే
హేతువాద కరదీపికలైతే చాలు

# 2. అమ్మ

'అమ్మ' పదంలో వుంది మాధుర్యం
'మమ్మీ' పదంలో లేని ఔదార్యం
అమ్మలో దాగివుండు శౌర్యం
కనరాదు ఎన్నడూ క్రౌర్యం

లాలనగా పాడె అమ్మ ఓ పాట
మృదువుగా వెలువడే తన నోట
ముచ్చటగా ఆలపిస్తూ ఆపాట
నిదురించెపాప తన చోట

అమ్మ హృదయమే ఒక దీపం
జాలి, మమతలకది ప్రతిరూపం
బిడ్డలను పెంచుతుంది ప్రాణంగా
తన సంస్కారమే ప్రమాణంగా

మాతృమూర్తి సద్గుణ సంపదకు పెన్నిధి
దైవత్వానికి ఆమె నిజంగా సన్నిధి
నలభీమ పాకంలో కళానిధి
ఆమె సన్నిధే మన పెన్నిధి

అమ్మ కట్టె ఓ పట్టుబట్ట
కోరిన ఒసగుట యందామె దిట్ట
కన్యనే విద్యార్థులు పొందగల్గుతున్నారు పట్టా
ఆమే కాపాడుగా తండ్రి చిట్టా

ప్రార్థనా క్రమమున "తల్లి"యే ప్రథమం
తల్లి ముందు దైవం సయితం అధమం
ఆమెకు నమస్కరించిన కల్గు ఫలం
ఆమె అడుగు జాడలే మనకెంతో సుఖం

వినయ, విధేయత లందామె మిన్న
జ్ఞాన సంపద కేమీ కాదులే చిన్న
లేవిక పదాలు ఆమె గుణములెన్న
దోషాలు, దుర్గుణాలు అమ్మలో సున్న

అమ్మ పోతరాజు వెంకట లక్ష్మిగారి
ఆఖరి జన్మదినం 27-7-1977 తొలిఏకాదశి సందర్భంగా
రాసింది
అదే ఆఖరని తెలియక
కాకతాళీయంగా ఆనాడు
అంకితమిచ్చిన కవిత ఇది
అప్పుడు చూసిన ఆవిడ
కళ్ళల్లో తృప్తి, కూతురి పట్ల గర్వం
నా కెప్పుడూ గుర్తుంటాయి

**(1-10-1977న స్వర్గస్థురాలైనారు)**

# 3. నాన్న

బడి పంతులు మా నాన్నని గర్వంగా చెప్తాను
హెడ్ మాస్టరయి మమ్మల్ని క్రమశిక్షణలో పెంచారు
అన్నయ్యలకి బ్రహ్మోపదేశం చేస్తూనే
చదువంటే జీవన నౌకకి చుక్కానని మాకు జ్ఞానోపదేశం చేసారు

సంతానానికి స్థిరాస్థులివ్వలేదని మథన పడ్డారు
తరగని సంస్కారాన్నిచ్చి మాలో మాకు అనుబంధం పెంచారు
ప్రతిచిన్న విషయాన్ని కూలంకషంగా వివరించిన నిఘంటువే వారు
అష్టాదశాధ్యాయ గీతా పారాయణ వారి నిత్యానుష్ఠానం
గీతా మకరందాన్ని ఆపోసన పట్టారు
ఆదిత్య హృదయం, లక్ష్మీ నరసింహ కరావలంబ స్తోత్రాలు,
శతకాలు, పద్యాలు ఆధ్యాత్మిక ప్రక్రియలన్నిటిలో నాన్న రూపం
కనిపిస్తుంది.

అంత్య దశని ఘంటసాల వారి గీతా శ్రవణం, రామదాసు కీర్తనలతో
ప్రశాంతంగా ప్రస్థావన కావించి, ఆస్తికతకి ఆదర్శమయ్యారు
అడుగడుగునా అత్యున్నతంగా నిలిచిన వారి
ఆప్యాయత, ఆదరణ నేనెప్పుడూ మరచిపోలేను.

(2003 మా నాన్న గారు కీ.శే. పోతరాజు రామచంద్రరావు గారి శతజయంతి
సంవత్సరం అని గుర్తొచ్చి ఎగిసిన భావకెరటం)

జననం : 6-8-1903

మరణం : 31-5-1983

# 4. జాతీయత

అనంతం విశ్వం
అతి విశాలం ప్రపంచం
అఖండ ఖ్యాతి గలదీ భరత ఖండం
క్రమశిక్షణకి మారుపేరు ఇక్కడి కుటుంబం
దేశాలన్నిటికీ తలమానికం మన సంస్కృతి సంప్రదాయం

ఈ పుణ్య భూమికి అండే మనిషీ మనిషీ సత్సంబంధం
భిన్నత్వంలో ఏకత్వమే ఎదురులేని అంతస్సూత్రం
జీవ నదుల సాక్షిగా అంతర్నాడి అంతంకాని ఆస్తికత్వం
మారుతున్న ప్రపంచంతో మనది సమాంతర పయనం
ఇంకిపోని అంతర్వాహిని భారత జాతీయత
సారూప్యమే లేని ఈ భారత జాతీయతకి మన జోహార్లు
భారత మాతకి మన ప్రణామాలు

# 5. తెలుగు

బ్రతకడానికి ఆంగ్ల భాష తెలుసుకో
మనుగడ కోసం జాతీయ భాష మననం చేసుకో
స్కోరింగు కంటూ సంస్కృతాన్ని ఎన్నుకో
తెలుగుని మాత్రం తెరమరుగు కానియ్యకు

ఇకనైనా సంబోధనల్ని మాతృభాషలోనే కానీ
మమ్మీ! డాడీ! సంస్కృతి కాదు మనది
దీపాలు వెలిగించే సాంప్రదాయాన్ని తారుమారు చేయకు
దీపాలు ఆర్పాక ఇంకేం హ్యాపీ బర్త్‌డే?

తెలుగు మృగ్యమనే వేదన లేదు
ఎన్ని భాషలొచ్చినా ఎదురులేనిదీ మాతృభాష
అజంత భాషకి శ్రావ్యత సొగసులెక్కువే
తెలుగు తల్లి అమృత కలశంలో హరించిపోని జీవధారే
ఈ తేనెల తెలుగు.

# 6. ఆశ

భరతావనికే కలికితురాయి కాశ్మీరమనీ
ప్రకృతిని పొందికతో పొందుపరిచిన
వెన్నెల పటమనీ విన్నప్పటి నుంచీ
ఆ అందాలని కన్నుల విందు కావించాలన్న
ఆశ మస్తిష్కాన్ని ప్రేరేపిస్తూనే వుంది.

ఊహ తెలిసాక మిత్రులు
విహార యాత్ర కెళ్తుంటే అంత డబ్బు లేదన్న
బడి పంతులు నాన్నని ఎదిరించలేదప్పుడు
నాయని కృష్ణకుమారి గారి 'కాశ్మీర దర్శనం' చదివి
ఆ అందాలన్నీ ఆస్వాదించాలన్న ఆశ అధికమైంది.

హనీమూన్‌కి అక్కడికే వెళ్దామంటే
కొత్త ఉద్యోగాల్లో అంత శెలవేది?
సంసారం బాదర బందీల్లో తేరుకునే సరికి
పదోన్నతీ, బదిలీల పర్వం ప్రారంభం
తేరుకుని ఆశగా కాశ్మీరాన్ని చూసే సరికి
పచ్చని ప్రకృతి నెత్తురు మరకల్తో గాయపడి ఎరుపెక్కింది.
ధవళ తుషారాలు రుధిర తుల్యమయ్యాయి
యాత్రికుల కిడ్నాపులెక్కువయ్యాయి.

నాడు కృష్ణ కోసం కురుక్షేత్రమైతే
నేడు కాశ్మీర కన్యకోసం భారత్ పాక్‌ల
సరిహద్దురేఖలు హద్దులు మీరి హడలుకొడ్తున్నాయి

ఆ ప్రశాంత ప్రకృతి ఒడిలో సేద తీరే దెప్పటికో అన్న దిగులుతో
తడిసిన రెప్పల్ని బరువుగా రెపరెపలాడిస్తూ
రేపటి ఉషోదయానికి వేచి చూస్తున్నా!

ముగ్ధ మనోహర కాశ్మీరం -
భారతానికే జిలుగు పయ్యెదై శిరస్సు కప్పినట్లు
హిమాలయ తుషారాల్లో మెరిసిపోవాలని
ఆశతో వేచివున్న ఓ సగటు
భారత జాతీయత నాది

# 7. అరుణోదయం

తూర్పున బాల భానుని ఆగమనం
లోకానికే క్రొంగొత్త దిన సమీపం
విరిసిన కమల రేకుల పరిమళం
ఝుం ఝుమ్మని వ్రాలే తుమ్మెదల ఝుంకారం

పక్షుల కిలకిలారావాలు
లోకానికే చక్కటి మేలు కొలుపులు
గూడు వదిలి పక్షులు ఓగిరాని కేగటం
మనల్ని కార్యోన్ముఖుల్ని చేయటానికే.

ఆకాశంలో పక్షుల బారులు
కాలువ గట్లమీద రైతుల జట్టులు
పల్లెలో పశువుల గుంపులు
కదన రంగానికెళ్తున్న సైనికుల సంబరంలా తోస్తోంది

ఇనుని కిరాణాల కాంతితో మెరిసే
పచ్చని పైరులు కన్నుల పండుగ చేస్తుంటే
కంకులతో బరువెక్కిన పైరులు వంగి
భాస్కరుని సవినయంగా ఆహ్వానిస్తున్నాయి.

కాలకృత్యాలకి పల్లె ప్రజలు
కాలువ తీరాన, గుమిగూడితే
పట్టణాల వాసుల వన్‌వే ట్రాఫిక్ అన్నట్లు
వాష్ బేసిన్ వద్ద వరుస కట్టారు

ఉదయిస్తున్న ఆ బాల భానుడి కిరణాలు
సంఘంలోని తామసాన్నీ, చీకటి బజారునీ
తూర్పారబెట్టే తీక్షణ బాణాలవ్వాలి
అది జనానికి అస్తమయమే లేని
అరుణోదయం కావాలి

# 7. గోల్కొండ కోట

"గొల్ల కొండ" పేరుతో మొదలైన కోట,
కాల క్రమంలో "గోల్కొండ"గా మారింది
నాటి మహోన్నత బురుజులు
నేటికవి శిథిల చారిత్రక రాజకీయ గుర్తులు

చల్లని గాలులు ఓ మూల వీస్తే
వెచ్చని సెగలు మరోమూల రేగుతుంటాయి
వైరుల్ని వశపరుచుకునే వింతైన రీతులు
ఓసారి చిక్కుపడితే అశరీరాలే

రామభక్తుని బంధిఖానా
శిథిలమైన సీతారాముల చిత్రాలు
చీకటి మూగిన ప్రదేశాలు చెబుతాయి
నిత్య కాంతులీనే ధన్య చరితలెన్నో

ఒకనాటి ఖైదీ కూలీ కుతుబ్‌షాహి,
మరోనాటి హైద్రాబాద్ ప్రభువు
మనో నిశ్చయానికీ, వజ్ర సంకల్పానికీ, మారు రూపం
భాగమతీ ప్రణయ గాథా రూపం, భాగ్య నగర నామం

గతించిన వైభవాలే ప్రతీ అణువులో
నిలిచాయీ నాడు నాటి చిహ్నాలై
నాడు భాగమతీ నాట్యాల రవళి మ్రోగిన నేల
నేడు కాల సర్పాల కాలయమైంది

విద్యుద్దీపాలు, ధ్వని తరంగాలు అనుకరించదగిన ఆదర్శ గాధల
నిలయం
ఆనాటి వైభవాల్నీ, చరిత్రనీ
ఈనాటికీ సజీవంగా నిలుపుతున్నాయి
అందుకే ఓ గొల్కొండ కిల్లా ! నీకు సలాములు

# 9. కళ్ళు

ముఖ గేహానికి ద్వారాలు కళ్ళు
హృదయ కుహుర కవాటాలే కళ్ళు

బాహ్య సౌందర్యమే కాదు
లో చూపున్న అంతః చక్షువులే అవి

ముక్కంటిలా మూడోకన్ను మనకే వుంటే
అధర్మాన్నీ, అవినీతినీ మసిచేసి
భావిని ప్రజ్వలంగా చూడలేమా?

# 10. పల్లవి

జీవన రాగానికి పల్లవేది?
"ఊర్ధ్వమూల మధఃశ్శాఖం" అయిన
సంసార వృక్షానికి పల్లవెక్కడ?
అనిశ్చిత ఈజగతికి పల్లవే శూన్యం
అయితేనేం?
ఆశాజీవి, కవికి -
అభ్యుదయ పథమెప్పుడూ ఓ అనంత పల్లవే

# 11. ఓ పితామహా!

సోదర భారతీయులకు నీవిచ్చిన సలహాలు పాటించి తీరాలి
ఓ బాపూ!
మితముగా మాట్లాడమంటివి
ఒక్క నిముషమైనా వృధా చేయరాదంటివి
మూడు మూరల బట్టతో ముల్లోకాల ఖ్యాతి గడించితివి
పొదుపరి తనంలో నీకు నీవే సాటి
దైవ ప్రార్థన నిత్యావసర మంటివి
వ్యాయామమెంతో అవసరమని ఆచరించి చూపితివి
మితాహారమే ఆరోగ్యమని పప్పు, పాలతో గడిపితివి
స హృదయమే తెలివికన్న గొప్పదంటివి
మానవులలోని మానవత్వాన్ని వెలికి తీసి
అంటరాని వారికి "హరిజనుల"ని నామం బిడితివి
నీ అడుగు జాడల్లో ప్రతీ మానవుడు నడిచే రోజు
ఓ పితామహా! తొందర్లోనే వస్తుంది

# 12. దీపావళి

వచ్చిందోయ్ వచ్చింది దీపావళి రేయి
పిన్న పెద్ద లెదురు చూసే పండుగ రోజు
టపాకాయల ధ్వనులతో, పటాకుల ప్రకాశాలతో
అమావాస్య రేయి పూర్ణిమగా మారింది

మత విచక్షణ లేనిదీ పర్వం
మహమ్మదీయ, క్రైస్తవులు సహితం
హిందూ సోదరులతో చూపే ఉల్లాసం
అభినందించాల్సిన హర్షం

ఆనాడు సత్యభామ రణరంగాని కెళ్ళినట్లే
ప్రతీ యువతి వీర వనిత కావాలి
విషమ పరిస్థితుల్నీ చిరునవ్వుతో ఎదురించాలి
లోకానికే తరుణి మార్గదర్శి కావాలి

విశాల భావమనే ప్రమిదలో
ఆదర్శమనే చమురుతో
మహిళా దృక్పథమనే వత్తితో
వెలిగించే దీపాల వరుసే సంఘానికి అసలైన దీపావళి

# 13. ప్రశాంతత

పుడమి మీద రాక్షస పులులే కాదు
సాధు గోవులూ ఉంటాయి
క్రూర పులుల వల్ల గోవుల రక్షణ లోపించినా
జయమెప్పటికీ ధర్మానిదీ, న్యాయానిదే
రాక్షసత్వం రూపుమాస్తే పుడమంతా శాంతమే
క్రౌర్యం అణగారితే అవనంతా ప్రశాంతతే
అందుకే నీ ఒక్క మనసుని ప్రశాంతంగా ఉంచగలిగితే చాలు

# 14. నిరీక్షణ

నీ రాక కోసం ఆతృతతో నిరీక్షణ
నీ తలపులతోనే ఉప్పొంగే ఈ కలికేక్షణ
ఎదురు చూపులు వృధాయేనా? ఎందుకీ ఆక్షేపణ
ఎప్పటి కొస్తావు? అందాకా తప్పదా? ఈ సంక్షోపణ!

హృదయాన్ని పీఠంగా మార్చి
ఆశల్ని కుసుమాలుగా పేర్చి
ఆవేదన్ని హారతిగా చేర్చి
తలపుల్ని గేయాలుగా కూర్చి

నీ కోసం ఎదురు చూస్తుంటే ఎన్నాళ్లీ మౌనం
కలగదా నాపై దైన్యం
అందుకో నా వగరెక్కిన మనోరాగం
ఇక మాను నీ క్రౌర్యం, ఇటు సాగించునీ పయనం

నీకై మార్చిన హృత్పీఠం అలసిపోతుంటే
ఆశా కుసుమాలన్నీ వడిలిపోతుంటే
ఆవేదనా భరితమైన జీవిత హారతి ఆరిపోతుంటే
తలపుల గేయాలు కన్నీటిలో కరిగిపోతుంటే

ఎందుకింత నిర్లిప్తత
నీ పవిత్ర పాదధూళి సోకితే చాలు
నా అలపు తీరి వాడిన సుమాలు వికసిస్తాయి
మోడైన బ్రతుకు చిగురిస్తుంది.

విశాలభావమయ నవ సమాజానికీ
అభ్యుదయ కవన పాదాల చిరుస్పర్శకీ
ప్రగతి పథనూత్న రాచబాటకీ
ఆరాధనతో అన్వేషణే ఈ నిరీక్షణ

# 15. దేవాలయం

అది ఓ దేవాలయం
అందరికీ శాంతి నిలయం

ఆస్తికుడో, నాస్తికుడో కాలేని యువకుడికి
వరమివ్వని వేల్పు మ్రాన్పడివున్న స్థానం

బాలలకి తీర్థప్రసాదాలు దొరికే స్థలం
ఆపద గడిచిన వాళ్ళకి మ్రొక్కులు చెల్లించే ప్రార్థనాలయం

కడుపు మండుతూ చిల్లర కెగపడే బిచ్చగాళ్ళకి
భక్తుల కోసం ఎదురుచూసే నిరీక్షణాలయం

దాంపత్య జీవితంలో కాలుపెట్టే వధూవరులకి
ఆ దేవదేవుని మందిరం ఓ కళ్యాణ మంటపం

అరనిమీలిత నేత్రాలతో పరబ్రహ్మంలో లీనమైన భక్తురాలికి
బ్రహ్మానంద మందించే మరో ప్రపంచం

పాప పరిహారమయ్యే పవిత్రాలయం
అది ఓ దేవాలయం, దేవుని ఆలయం



విద్యాలయాలే విద్యార్థుల పావన దేవళాలు,
విద్యాదాతలే దైవాలు, గ్రహీతలే భక్తకోటి
ఆట పాటల తేలే విద్యార్థుల కదొక ఆటస్థలం
బాదర బంధీలేని స్వేచ్ఛాజీవుల కూడలులు.

కుల, మతాల కతీతమైన స్నేహలతలు
అల్లుకొని పుష్పించే కుసుమ పందిళ్ళు
చదువు, సంస్కారాలు నేర్పి, భావి పౌరులని తీర్చే ఉత్తమ గృహాలు
అవి విద్యాలయాలు, చదువుల రాణి నిలయాలు



మానవాళికి కడుపు నింపే ఆనకట్టలు
పరవళ్ళ ప్రవాహాల కళ్ళాలే ఈ అడ్డుకట్టలు
అవి జాతి గర్వించ దగ్గ బహుళార్థ సాధక ప్రాజెక్టులు
మన చాచా నెహ్రూ ఊహల్లోని మానవతా మందిరాలు

తమ నీళ్ళు వృధా చేయని నదీ నదాలు
పైరు పచ్చలకి ప్రాణ దాతలు
ఆ రైతుకే వెన్నుపూస ఈ ఆయకట్టలు



ఈ ఆలయాలు ఓ మచ్చుతునకలే
మనశ్శాంతి నిచ్చే ప్రతీ స్థానం
పరమానందాన్ని పంచే ప్రతీ హృదయం
మనం ఆరాధించ దగ్గ దేవాలయమే

ప్రతి మనసూ ఓ ఆనంద నిలయమై
మంచిని పెంచి, క్రౌర్యాన్ని తుంచితే
మార్క్స్, లెనిన్‌ల అంతరాత్మలు నాట్యమాడవా?
ప్రపంచాలయ శిఖరం ప్రశాంతతే కాదా?

# 16. నత్త నడక

సంసారం ఓ ఎద్దుల బండిఐతే
భర్త ఠీవిగా కూర్చుంటే
భార్య గానుగెద్దవ్వాలా?
ఇంకెక్కడి సాఫీ నడక
అప్పుడది నత్త నడకేగా!

# 17. చింత

అనురాగ పూరిత మనసు తారస పడ్డప్పుడు
స్నేహలతలు హృదయాన్ని అల్లుకున్నప్పుడు

ఊహా సుందరి కాలి గజ్జెలు మదిలో మారు మ్రోగినప్పుడు
బీద హృదయ కబ్జధారలు గాంచినపుడు

శుక్లపక్ష నెలరాజు కళలతో వృద్ధిపొందుతున్నప్పుడు
కృష్ణపక్ష చంద్రుడు నానాటికీ క్షీణిస్తున్నపుడు

ప్రేమ భరిత విషాద గాథలు చదివినపుడు
కవితా వస్తువు తోచక కలం కటకట పడ్డప్పుడు

మూడునాళ్ళ ముచ్చటైన జీవితంతో పోరాటం చేస్తున్నప్పుడు
అశాశ్వత జగతిలో తెలియని ఆశతో అశ్రులు చాస్తున్నప్పుడు

ప్రాచీన జగతి సత్రంలో చిత్రవిచిత్రపాంథుల -కాంచినపుడు
కవిత రాయాలని ఉవ్విళ్ళూరింది హృదయం

మదిలో మెదిలిన అలౌకిక భావాలతో
కలం చేత పట్టే సరికి అంతా శూన్యం

మూగ భావాలని మనసులో బంధించటం
హృదయంలో ఆరాధించటం తప్ప ఏం చేయగలనన్నదే చింత.

## 18. నేస్తమా!

శృతి చేయని నా హృదయ వీణపై
మమతల తంత్రులతో స్నేహగానం చేసిందీ

ఎడారిలో మృగతృష్ణ వెంట పరుగిడుతుంటే
వర్షపు జల్లై అనురాగ పంట పండించిందీ

పెను కెరటాలతో మునగనున్న జీవిత నావకి
చుక్కాని తానై ఒడ్డు చేర్చిందీ

కటిక చీకటిలో అలమటిస్తుంటే
వెలుగురేఖై చేయూత నిచ్చిందీ

ఆలోచనా పరంపరతో వేగి పోతుంటే
చిరు నగవుతో పలకరించి సేద తీర్చిందీ

అనారోగ్యంతో కృంగుతుంటే
దివ్యౌషధమైందీ నీ ఊహే

ఓయీ! నువ్వెవరివో మరి
నా ప్రాణప్రదమైన నేస్తానివి

నీ స్మృతి నాలో ఓమరచిపోలేని తృప్తి
మరి నేనెప్పటికీ నీ కో మధుర స్మృతినే

నేస్తమా! సృష్టిలో విలువైన దానా!
పంచుకున్న కొద్దీ పెరిగేదానా!

నువ్వున్న చోట వుండదు శత్రుత్వం
అందుకే నేస్తమా! నీకు నేనివ్వగలగేదేముంది

నిన్ను (స్నేహాన్ని) నలుగరితో పంచుకోవటం కన్నా
పలువురితో పెంచుకోవటం తప్ప.

# 19. సేద్యం

కృష్ణా గోదావరుల పుట్టిళ్ళు
పెల్లుబికే తరంగాల కూడళ్ళు
రోషంతో జేవురించిన సూర్యబింబాలు నీకళ్ళైతే -
నిస్సహాయంగా మస్తిష్కం మొద్దుబారితే -

ఆ ఝురుల ప్రవాహంలో
నీ మెదడుని సస్యశ్యామలం చేసుకో
రాటు తేలిన నీ ఎద పాళితో లిఖిస్తూ
మహా కావ్యాలనే పండించుకో -

ప్రశాంతతా ఫలం అనుభవిస్తూ
మనోక్షేత్ర పొలం గట్లమీద
కావ్య కళామతల్లి వెదజల్లే
శాంతి సుఖాల మంద మారుతాన్ని గ్రోలొచ్చు

## 20. అర్పణ

పసిపాప పాల నవ్వుల్లో
ముదుసలి బోసి నవ్వుల్లో

విద్యార్థి పడే శ్రమలో
కష్టజీవి కాయకష్టంలో

ప్రకృతి ఆహ్లాదంలో
వికృతమైన ఆపదల్లో

పొట్టకూటి కోసం జనుల కవ్వాట్లలో
మమతను చాటే పశువుల్లో

చివురించిన గున్నమావి రెమ్మల్లో
మోడు వారిన చెట్ల కొమ్మల్లో

ముగ్గులు తీర్చిన ముంగిళ్ళలో
వసంత లక్ష్మిని ఆహ్వానించే గడపల్లో

ప్రాతఃకాల ఉషస్సులో
సాయం సంధ్యాకాంతుల్లో

మురిపించి, లోకాన్నే మరిపించే అనురాగాల్లో
హృదయాన మారుమ్రోగే నిత్యనూత్న రాగాల్లో

కవితామ తల్లీ! నువ్వే దర్శనమిస్తావు
కానీ-నిన్ను ఆరాధించే శక్తి నాకెక్కడిదిలే

నిన్ను సంపూర్ణంగా కొలవాలంటే ఈ జన్మజాలుతుందా?
ఇంకో వేయి జన్మలెత్తినా నేనే ఓడిపోనా

వచ్చీరాని జిలిబిలి పలుకులని ముద్దుచేసే తల్లిగా
ఈ అల్లిబిల్లి కవితనే నీ పాద పూజకి అర్పిస్తున్నా

# 21. ది బెస్ట్

ప్రపంచ పరుగుల్ని ఓ కప్పులో దాస్తే
ప్రపంచ కప్పు ఐనా

విజ్ఞానాన్నంతా ఓ చక్రంలో బిగిస్తే
సిడి ఐనా

ఎంత ఉరుకులు పరుగెలెత్తినా భారత్
పదేళ్ళు వెనకేనంటున్నారు

ఐతేనేం? ఐటిని హైలెట్, హైటెక్ చేస్తున్న
ప్రతిభతో పాటు

భారతీయుల సబంధ, బాంధవ్యాలూ
ప్రపంచ దేశాల్లో ది బెస్ట్ కావా?

## 22. ఉగాది

'నేల' నామ సంవత్సరం నా పనయిందనుకుని వెళ్ళిపోయింది
'పింగళ' కళంకమేమీ లేకుండా వచ్చేసింది

లేలేత చిగుళ్ళకి పులకించి కోయిల గొంతువిప్పింది
వసంతోదయానికి మనో మయూరం పురివిప్పింది

పిల్ల తెమ్మరల తాకిడికి గల గల నవ్వేగుబుర్లు
నల్ల మబ్బు నందుకోవాలని ఎగసి పడే కెరటాలు
మల్లెల మత్తెక్కించే పరిమళాలు
ఎల్లలు లేని ఎదలో పండే మమతల పంటలు

ఏళ్ళు మారినా పునాదులు కదలని పర్వతాలు
గూళ్ళు విరిగినా డొక్కే నిండని నిర్భాగ్య పక్షులు

జీవన సంద్రంలో ఎన్నెన్నో నిత్యనూత్న కెరటాలు
మంచీ చెడు మధురం చేదుల పరిచయాలు

ఆకులు రాలి చిగుర్లొస్తే ఇగుళ్ళు ముదిరి రాలక తప్పదుగా
పండుటాకులు రాలితే పచ్చి ఆకులు పండుతాయి మరి

ఆనందంలో విరితోటగా తోచే ప్రకృతే
మనో విచారంలో జీరవోదా?

ఎన్ని మారినా నిస్వార్థమైన కాల చక్రం ఆగదు
నిన్ను చూసి మెప్పు జాలి పగ చూపదు

ప్రతి ఉగాదికి షడ్రుచులూ ఆరగించటం
సుఖ దుఃఖాలని సమంగా ఎదుర్కోటానికేగా

మిత్రమా! ఇదే నూత్న వత్సర శుభాకాంక్షలు
నా హృదయ పూర్వక ఆకాంక్షలు

కాలం, దేశం, ప్రాంతాలకి అతీతమైన
స్నేహానికి నా శుభాకాంక్ష సందేశాలు

**(19-3-1977 ఉగాది సందర్భంగా ఉప్పొంగిన కెరటమిది)**

# 23. ట్రిప్లీ

ఎంథుజియాజిమ్, ఎమర్జెన్సీ, ఎంజాయ్‌మెంట్
ఇవే ఈ నాటి భవిష్యత్తున్న - ట్రిప్లీలు

ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రికల్స్, ఇంజనీరింగ్ అంతాఫాస్టే
క్షణాల్లో సర్వం నీకు సిద్ధం
వేలకి వేల పెట్టుబడికి నీవు సిద్ధమైతే

పూట గడిస్తే చాలనుకునే సగటు జీవికి
త్రికరణ శుద్ధే మహా ట్రిప్లీ

# 24. కోటి హృదయాలు

నిందాస్తుతులకీ
శీతోష్ణ సుఖ దుఃఖాలకీ
మానావమానాలకీ
చేతనా చేతనాలకీ తుల్యంగా,
అంతకన్నా మించి అతీతంగా
విరాగి వయ్యావా! మాతృశ్రీ!
భగవద్గీతలో చెప్పినట్లు భగవంతుని ప్రియ భక్తురాలి వయ్యావా?

జీవముండి నిర్జీవంగా
కళ్ళుండి అంధురాలిగా
చెవులుండి చెవిటిగా
నోరుండి మూగగా
కాళ్ళు చేతులున్నా కుంటిగా
హృదయమున్నా ఊతిగుండెగా
మిగిలిన నువ్వు దేవుని పిలుపు కోసం ఎదురు
చూస్తున్నావా?
నీ ప్రమేయం లేకుండానే జీవన క్రియలు
జరిగిపోతున్నాయి
ఇది నీ బిడ్డలకి పరీక్షా సమయమా!
నా.కలానికి చేతనా సమయమా!
మమ్మల్ని ఏ వంతులు పోకుండా నిస్వార్థంగా పెంచావు

నశించిపోయే ఈ తనువు మీద మమకారం చంపుకున్నావా?
ఋణపిశాచాలైన బంధువర్గాన్ని మరచిపోయావా?
ఏ బంధం లేకుండా, విడవడ్డావు
మరణ శయ్యపై నిశ్చింతంగా వేచివున్నావు
తుది శ్వాస వరకు బంధనాలు తెంచలేనని బాధే నీకులేదు

అంతటి అదృష్టం ఎందరి కబ్బుతుంది?
అమ్మా! నీవు చేసినంత కాకపోయినా
నీ ఋణం తీర్చుకుంటున్నాం
అది ప్రేమే కానీ భాద్యతే కానీ....... !

నరకమంటూ ఏదైనా వుంటే
ఆ ద్వారాలు నీకు మూసి వుంటాయి
స్వర్గమంటూ వుంటే.
దాన్ని మేము నీ సన్నిధిలో చూసాం
నీకు స్వర్గద్వారాలు తెరచే వుంటాయి
ఎందుకో తెలుసా? గోవంత సాధువుగా
భూదేవంత ఓరిమిగా, అనసూయంత సాధ్విగా
స్వార్థరహితంగా మా మనసులో మిగిలావు
కన్ననే నీ కనిష్ట సంతానం నీకు భక్తితో అంకితమిచ్చే
చిన్ని కుసుమమిది

## 25. సరస్సు

నీ మనస్సే ఒక సరస్సయితే
తీరాన వీచే పిల్లవాయువుల్ని గ్రోలుతుంటో
ఆ సరోవరాన సాగిపోయే నావకు
చుక్కాని నౌతా నేను

ఆనావ సాంస్కృతికోద్యానవనానికి సాగాలనీ,
ఆవనం పరిమళ భరితం కావాలనీ
విశేష కవితా కమలాలు విరబూయాలనీ
ఆవలి తీరాన నిరీక్షించే నీ నేస్తాన్ని నేను

# 26. స్వప్నం

కలం వుంది,
కాగితం కనబడింది
మనో అంబరాన -
ఊహల మెరుపులు తళుక్కుమన్నాయి
కవితా జల్లుకి అడ్డుగా
నా అశక్యతా వురుములు వురిమాయి
నా హృదయాంతరాన వేదనల వడగళ్ళు కురిసాయి
కవనపు చిరుజల్లుల తడవాలనుకున్నా
మదిలో అశాంతుల ఈదురు గాలులు వీచాయి
కవితల చిరు చిరు జల్లులను చెదరగొట్టేసాయి

అయినా కలం కేలబూనాను
కవనపు పూలబాటలో కలం చిందులేయసాగింది
భావాల మెరుపులు మళ్ళీ తళుక్కుమన్నాయి
స్వప్నాల ఉరుములు ఉరిమిపోయాయి
వేదనల వడగళ్ళు కరిగిపోయాయి
కవితా జల్లుల్లో తడిసీ తడవకుండా మునిగాను
మనో అంబరాన ప్రశాంత చిరుగాలులు వీచాయి
కవితామ తల్లి చల్లని ఒడిలో సేద తీరాను

భవ బంధాలకి అతీతంగా
ఊహా ప్రపంచాన్ని చక్రవర్తినై ఏలాను
ఆయమ సున్నితపు వ్రేళ్ళతో గోరుముద్దలు తిన్నాను
పాల బువ్వతో పెరిగి పెద్దదాన్నవుతున్నా
కవితా సౌధాన్ని తప్పటడుగుల్తో అధిరోహిస్తున్నా
ఆ మహా సౌధపు తొలి మెట్టు నుంచే శిఖరాన్ని ఆశగా చూస్తున్నా
ఎక్కలేని ఆ పాలజాతి మందిరంలో నేనో చిరుదివ్వెనైతే
చాలనుకుంటున్నా

# 27. బుల్లి తెర

తెరచాటు ఆగడాలని
చెరగేసే చేట-ఈ బుల్లితెర
స్త్రీల ఆవేదన, ఆహుతి
తెరచాటునే తెల్లారిపోకుండా
చీకటి తప్పులకి చీకట్లోనే చరమగీతం పాడేయకుండా
పురుషుడి కామాన్ని కళ్ళకి కడుతోంది
కామాంధుల కామానికి వెలుగు తెర అవుతోంది
మహిళా మనుగడ మకుటాయ మానం కావడానికి
ఓ నాంది ప్రస్తావనయ్యే
బుల్లితెర వెలుగులు సంఘానికే సెర్చిలైట్లు
ఆ ఆలోచనా సరళులకి, కౌన్సిలింగ్ ప్రక్రియకి హాట్సాఫ్

(14-3-2003 టి.విలో దగాపడ్డ మహిళల కౌన్సిలింగ్ ప్రక్రియ చూసి ప్రభావితమై ఎగిసిపడ్డ కవితా కెరటం)

# 28. పరికించనం

మనో వికాసం లేని చదువెందుకు?
సాటి మనసును ఆదరించని సంస్కారమెందుకు?
ఆత్మవంచన చేసుకునే వినయమెందుకు?
మంచి అనిపించుకోవాలనే తపన ఎందుకు?
నీ మార్గం బుజువైందే అయితే భయమెందుకు?
జీవన సాగరంలో మునకలు తప్పవు
ఎదురీదకా తప్పదు - తేలావా? ఒడ్డుచేరుతావు -
మునిగావా ! అనుభవం వస్తుంది
ఓ నేస్తం! అమూల్యమైన కన్నీల్ళు కష్టాలకి ఖర్చుచెయ్యకు
ఆనంద భాష్పాల కోసందాచుకో
వృధా విచారాలతో కాలయాపన చెయ్యకు
వేదనలకి మూలమెక్కడో
విచారానికి విరుగుడేమిటో
ఆత్మ పరికించన చేసుకుంటే అంతా శాంతిమయమే.

# 29. నా కవిత

కణ కణ లాడే నిప్పురవ్వ నా కవిత
అనురాగం చాటే మెత్తని పువ్వు నా కవిత

సంఘ విద్రోహాలను చెరిగేసేచేట నా కవిత
హృదయాలని చీల్చుకుపోయే విరిబాణం నా కవిత

రక్తపుటురకల్ని పెంచే విప్లవ గీతం నా కవిత
మనసుల్ని సేదతీర్చే మందమారుతం నా కవిత

అబలల, ఆర్తుల ఆర్తనాదం నా కవిత
కామాంధుల, భూస్వాముల విరోధం నా కవిత

జాతిని సమైక్య పరిచే శంఖారావం నా కవిత
కళాప్రియులని అర నిమీలితుల్ని చేసే మురళీ రవం నా కవిత

మనుషుల మధ్య స్నేహం పెంచే స్నేహమయి నా కవిత
ఎదలో అనురాగం పండించే రాగమయి నా కవిత

మాతృమూర్తులని పులకింపజేసే పసికందు నా కవిత
కవితా రాచబాటలో తప్పటడుగులు వేస్తున్న బాల నా కవిత

సాంస్కృతో ద్యానవనంలో తొడిగిన చిన్న మొగ్గ నా కవిత
గొప్ప గొప్ప కవుల ముందు తలవాల్చే గడ్డిపువ్వే నా కవిత

# 30. విధి వంచితులు

కళ్ళూ కాళ్ళూ లేని వికలాంగులే కాదు
అన్నీ వుండీ సంఘానికి భారమయ్యే బడుద్ధాయిలు కూడా
వరకట్నం పొయ్యలేని అబలలే కాదు
కట్నానికమ్ముడు పోయే బాచులర్స్ కూడా

వంచింపబడ్డ వనితలే కాదు
వంచన చేసే వంకర మనసులు కూడా

'విధి వంచితులే'!

# 31. ఒక దీపం వెలిగించు

నువ్వూ ఒక దీపం వెలిగించు -
జాతికలుముకున్న చీకట్లని పటాపంచలు చేయటాన్కి
అంధకారంలో అలమటిస్తున్న జీవితాలకి వెలుగు చూపటాన్కి
తామసంలో తలమున్కలవుతున్న పెత్తందార్లని సాత్వికంలోకి
లాగటాన్కి
కుట్రల చీకట్లని తొలగించి సామర్థ్యాన్ని ప్రకాశింపజేయటాన్కి
మూఢాచారాల, అంధ విశ్వాసాల తెరలని మసి చేయటాన్కి

నువ్వూ ఒక దీపం వెలిగించు

నీ చుట్టూ వెలుగు నింపటాన్కే కాదు
టపాకాయల్ని టపటపలాడించటాన్కే కాదు
నిన్నావరించిన కాంతిని పదుగురికీ పంచటాన్కి
నువ్వు మ్రోగించే ఢమ ఢమలు గుండాల గుండెల్లో గుభేలు
పుట్టించటాన్కి

నువ్వూ ఒక దీపం వెలిగించు

నువ్వూ, నేనూ మనమంతా మనోదివ్వెలతో ముందుకి సాగుదాం
యువశక్తి-విప్లవగీతారాగంగా, శ్రేయోరాజ్య తాళంగా
వెలుగు బాటలో పయనిద్దాం

# 32. ఓదార్పు

మతోన్మాదం మస్తిష్కానికి ఎక్కి,
కులాల అడ్డుపొరలు కళ్ళని కప్పి,
మానవత నశించి మనిషికి మనిషే శత్రువవుతుంటే
భారతమాతా ! బాధ పడకమ్మా!

తెలుగు తల్లి గర్వించే కవిత్రయం
శ్రీనాథ, పోతనలం కాలేకపోయినా
కరవాలాని కాన్న కలానికి విలువిచ్చే
నీ గారాల బిడ్డల మమ్మా!

కరవాలం చిందించే రక్తాని కన్న
నా కలం చిమ్మే మాధుర్యం మిన్న
అందరం కలిసి బ్రతుకుదామోయన్నా!
అంటూ గళమెత్తి పాడతానమ్మా.

'హిందూ ముస్లీం భాయీ-భాయీ' అని బాపూజీ అన్నా
'ఆత్మవత్సర్వ భూతాని' అని గీత ఘోష పెడ్తున్నా,
'పొరుగువాడిని ప్రేమించ'మని బైబిలు చెప్తున్నా,
అన్ని పలుకుల పరమార్థం ఒక్కటేనన్నా.

మున్నాళ్ళ ముచ్చటైన జీవితనావ
తీరని ఆశల కెరటాలకి చిక్కుకుంటే
చుక్కాని వంటి ఓ మతాన్నెన్నుకో
అది ఏ మతమైనా నిన్ను తీరం చేరుస్తుంది

జాతి మతాలకి అతీతంగా
ప్రేమానురాగాలకి ప్రతీకలుగా
స్నేహాభిమానాలకి వారసులంగా
మా బాలలంతా ఒక్కటిగా కలిసుంటాం.

నేటి మేమే రేపటి పౌరులం కదమ్మా!
నా ముద్దు పలుకులకి ముదమందవమ్మా!
కన్నీళ్ళని కొనకొంగున తుడవ వమ్మా
ఆనంద బాష్పాలు నీ పాదాలు కడగ ప్రణతి చేతునమ్మా!

## 33. అన్వేషణ

అభ్యుదయ కవితకి నా ఎద స్పందించాలనీ
ఒక్క పదమైనాఆ త్రోవలో చిందేయాలనీ
అనుక్షణం మనసు అన్వేషిస్తూనే వుంది
ఆ అన్వేషణలోనే ఘడియలు దొర్లిపోతున్నాయి
ఆ అన్వేషణ అంతం లేనిది
సంఘం కుళ్ళు కడగలేనిది కనుక

## 34. సుకవి (త)

జటిల పదాల కావల
సరళ పదాల కూర్పుతో
ఛందస్సుల గారడి, సమాసాల కావడి కాక
పండితుడు నానార్థాల వివరణ చేసేది కాక
జానపదుడూ సులువుగా పాడుకో గలిగితే
ఆతడే సుకవి
అదే సుకవిత

# 35. శవోపదేశం

కటిక శ్మశానంలో
మింటి కెగిరే ఎఱ్ఱమంటలు
నాలుక చాచి, చేతులు జాపి,
నిన్ను పరిహాసం చేస్తున్నాయి
బ్రహ్మ జ్ఞానోపదేశం చేస్తున్నాయి
ఏనాటికో ఒక నాటికి ప్రతివాడూ రావలసిందే
అక్కర్లేని, అర్థంలేని ఈ మమత లెందుకు?
భవ బంధాలని తెంచమంటూ గొంతెత్తిపిలుస్తున్నాయి
బ్రతుకంతా ఒక పచ్చి నటనే.

ఉన్నన్నాళ్ళు నువ్వే లోకమని ఈగల్లా ముసురుతారు
డబ్బుంటే జలగల్లా పీలుస్తారు
తప్పుంటే కందిరీగల్లా వెంటాడి వేధిస్తారు
నువ్వు మెతకగా, అమాయకంగా వుంటే కాకుల్లా పొడుస్తారు
ఎదురు తిరిగితే ఎదుట దడిసినా, చాటున తిడతారు
సమాజం కుళ్ళును ఎత్తి చూపిస్తే నక్సలైటనో,
ఉగ్రవాదనో వెలివేస్తారు.

ఓ సోదరా ! ఇదీ వింత లోకం -
ఈ లోకం నీ ఊపిరాగి నువ్వు పంచభూతాల్లో కలిసిన రోజు
మొసలి కన్నీళ్ళు కారుస్తుంది.
ఘనంగా నిన్నుమోసుకు మరుభూమి చేరుస్తుంది
నిన్ను బండెడు కట్టెల్లో పెట్టి నిప్పంటిస్తుంది.
ఎంత ఆప్తుడైనా నువ్వు చివరంటా బుగ్గి అయ్యే వరకైనా వుండడు
జ్ఞానం, సంపద, స్థాయీ అని లేదు,
అందర్నీ సమంగా చూసే సమ సమాజ మిక్కడే.

(చివరి దశలో కాలిపోతున్న కళేబరాన్ని చూసినపుడు
(1982) లేచిన వైరాగ్య కెరటం)

# 33. కళ్ళ (ఆ) వేదన

నా కళ్ళు అరవిరిసిన తామరలు కావు
విచ్చుకున్న కలువలు అసలే కావు
మనో వేదనా జలంతో నిండిన సుడి గుండాలు
మతం పేరిట, కులం పేరిట రాజకీయాల నర్తనలకీ
విషాద ఘటనలకీ, విధి లీలలకీ రెండు భాష్పాలు
రాల్చే(శావణ మేఘాలే అవి
ఆ కళ్ళే ఇప్పుడుకాలాన్ని నిలదీసి ప్రశ్నిస్తున్నాయి.
కన్నీళ్ళ కలశంతో అర్థిస్తున్నాయి.
వసంతం నుంచీ శిశిరంలోకి నిర్దాక్షిణ్యంగా విసిరేయొద్దని,
స్నేహ బాంధవ్యాలని కాలరాయొద్దని
మమతల పందిళ్ళని పెకిలించొద్దని
నా కళ్లు కాలాన్ని ప్రార్థిస్తున్నాయి
కాలువలు కడ్తున్న అశ్రుధారలతో
నిశీధిలో నిద్రకి దూరమయి నిశ్శబ్దంగా విలపిస్తున్నాయి
తడి ఆరని రెప్పలు బాధల బరువుతో తప తపలాడుతున్నాయి
కనుపాప శూన్యంలో తైలవర్ణ చిత్రాల పిచ్చి గీతలు గీస్తోంది.
త్రికాలాలకి తలవంచే కనుబొమ్మలు వినయంగా వంగేవున్నాయి.
వాల్చని కనురెప్పలు విప్లవానికి జోహార్లర్పిస్తున్నాయి.

ధర్మా ధర్మాలు, పాప పుణ్యాల బేరీజుని చూసి రెటీనా మూగగా నవ్వుతోంది.
కళ్ళు హృదయ మందిరానికి సింహద్వారాలు
భాషలేని భావాలని వినిపించే గ్రంథాలు
ఒకస్థాయిలో, ఆ నయనాలలో నీళ్ళే వుండవు
మనసే రోదిస్తుంటే కన్నీళ్ళతో పనేమిటి?
ఎండిన ఎదక్షేత్రం మీద చల్లేది ఆ నీళ్ళ నేనేమో?

నోరు పలకని భావాలెన్నిటినో వినిపించే ఆ కళ్ళకి
మూసిన పుటలని కూడా వినిపించే ఆ కళ్ళకి
భావిని ఆశగా ఆహ్వానించే ఆ కళ్ళకి (ఏ కళ్ళకైనా సరే)
నా జోహార్లు

# 34. నేనూ వ్రాసాను

లోకంలోని విషాద గీతాలన్నీ పాడేద్దామనుకున్నా
మృదు మాధుర్యమైన గళంలేకున్నా
ట్రాజెడీ చిత్ర నాయికననుకున్నా
లేశమైనా నటనా ప్రావీణ్యం లేకున్నా

ఏవో వడిగా చేసెయ్యాలనుకున్నా
ఎదురు దెబ్బలతో పైకి లేవలేకున్నా

మహా కవితలు రాయాలనుకున్నా
చెత్త డబ్బా రాక్షసి కబంధ హస్తల్లో చిక్కుకునే పిచ్చి
రాతలు వ్రాస్తున్నా

డాక్టరవాలని అహర్నిశలూ అనుకున్నా
పనికి రానని తెలసి ముందే పేషెంట్‌నయ్యా

మధురమైన శ్రావ్య గళాలని ఆలకిస్తున్నా
ట్రాజిడీ చిత్రాలని ప్రేమిస్తున్నా

మహా కవుల కలాల గీతాల్నే మననం చేస్తున్నా
తలపెట్టిన పనులకి 'నిదానమే ప్రధానమ'ని తెలుసుకున్నా

ఎదురు దెబ్బలని ఎదుర్కొనే యోచన చేస్తున్నా
అయోమయ స్థితిలో పిచ్చాపాటిగా వ్రాస్తున్నా
పరిస్థితుల్ని కసితో తిట్టుకుని
నువ్వైనా జాలి పడతాననే చిఱు ఆశతో
నేస్తం! మరీ మరీ వ్రాస్తున్నా

# 38. ఎంత దూరం

చావు బ్రతుకులకి
ప్రేమా ద్వేషాలకి
సుఖ దుఃఖాలకి
చీకటి వెలుగులకి
మంచీ చెడులకి
న్యాయా న్యాయాలకి
ధర్మా ధర్మాలకి
స్వతంత్ర పారతంత్ర్యాలకి
మిత్ర శత్రుత్వాలకి ఎంత దూరం?

అతి సామీప్యమే లేనేలేదు ఎంతో దూరం
ఒకటి  ఉన్నచోటే వుంటుంది రెండేదీ

బ్రతుకుని వెంటాడుతూనే వుంది మితి
ప్రేమాభిమానాలున్న చోటే ఈర్ష్యాద్వేషాలు
సుఖంలో దుఃఖం, దుఃఖంలోనేసుఖం
దీపం కిందే చీకటి
చీకటి మధ్యే వెలుతురు
చెడు లేనిదే మంచికి విలువే లేదు
న్యాయం అన్యాయమైతే అన్యాయమే న్యాయమవుతుంది.

నిజమైన స్నేహం కాదు అశాశ్వతం
ఎప్పటికీ అది శాశ్వతమే

పెంచుకున్న మమకారాలు క్షణంలో హరించుకుపోతాయి
అందుకే అశాశ్వతమైన ఈ జగతిలో
శాశ్వతమైనది నీ మంచి తనం ఒక్కటే
చెదిరిపోనిది నీ విశాల మనసు ఒక్కటే
తిరిగి రానిదీ దూరం తరగనిదీ నీ ఈ పయనం -

(18-11-1976న ఒకానొక మిత్రుడు 'రాము' మరణ వార్త
వినగానే ఎగిసిపడ్డ కెరటం)

# 39. ఓ మనసా

మనసు మనసుని ఆదరిస్తే ప్రణయం
ఆ మనసుల్ని మరేదో విడదీస్తే ప్రళయం
భంగ పడిన భగ్న హృదయం నుంచి
ప్రణయాగ్ని జ్వాల లెగిసి, నిన్ను దహించివేస్తే
ఓ మనసా! బెదరకు, చెదరకు
నీ మార్గం ఋజువయిందైతే వెరపెందుకు?
నువ్వొక కఠిన శిలగా మారినా సరే
సుందర శిల్పాలకి ఆలవాల మవ్వాలి
గతాన్ని వర్తమానపు పొఅతో తవ్వకు
భవిష్యత్ వలపు జలంతో ఊపిరి పొయ్యి

కాలంతో పాటు ఆ అలజడి సంద్రం సద్దుకుంటే
తీరాన్ని తాకే కెరటాలు అతి మామూలుగా
వెనక్కెళ్ళి నీ ఎద సంద్రంలో విలీనమైపోవూ!

# 40. అనంత మీ కెరటాలు

అనంతం కడలి కెరటాలు
అవధుల్లేనివి ఎద స్పందనలు
రక్త ప్రసరణ నిరంతరమైతే
ఈ కవితా ప్రక్రియా అంతం లేనిదే
రుధిరం హిమవంతం అయ్యేంతవరకు
శ్వాస స్తంభించేంత వరకూ
కవన కెరటాలు ఉప్పొంగుతూనే వుండాలి
ఈ కెరటాలు ఆగినప్పుడు ఆ ఎదకీ పదవీ విరమణే జరగాలి

ఏ యిజం వచ్చినా హ్యూమనిజం గొప్పదన్న
బాబా బోధల్ని కొట్టేయలేవుగా
ప్రపంచానికి అంతర్నాడి ఆస్తికత్వం
ఎప్పుడూ మరుగుపడకూడనిదీ జీవనాడి
ఆ నాడినే ప్రజ్వరిల్ల చేస్తోంది షిర్డీ ద్వారకామయి ధుని

నిరంతర స్మరణ, గాఢ విశ్వాసాలు
సడలనీయని సబూరి, ఆ సమర్థ సద్గురుడి సేవలో శ్రద్ధ
నాకు భిక్షగా దొరకాలనీ
ఈ కెరటాలతో ఆ పవిత్ర పాదాలని కడుగుతుంటాను

# అనుబంధం

## చేమంతుల సంచలన కలం 'చలం'

**రా**జమహేంద్రి – గోదారి తీరంలో – సూర్యోదయాన్ని చూడాలనే కోరికతో తెల్లవారు ఝామున 5 గంటలకి కార్తీక స్నానాలకి వచ్చిన జనాలు, అరటి దొప్పల్లో దీపాలు వదిలి వెళ్తున్నారు.

కొద్ది దూరంలో ఏదో గాంభీర్యపు అలికిడి అయితే అటుగా చూసాను. పెరిగిన మీసం, గడ్డం బాగా నెరసిపోయి వున్నాయి. కళ్ళల్లో మాత్రం తీక్షణత కనపిస్తుంది. ఓ తపస్విలా శాలువ పరుచుకుని కూర్చుంటున్నాడాయన. బహుశా నాలా అరుణోదయాన్ని చూడాలనే వచ్చివుంటారు –అనుకుంటూ తూర్పు రేఖలు కొద్దిగా విచ్చుకుంటున్న లేత వెలుగులో ఆ వ్యక్తిని చూడడంతో గుర్తుపట్టడానికి అట్టే సేపు పట్టలేదు.

ఒక్క ఉదుటన లేచి అక్కడికి పరుగెట్టి చేతులు రెండూ జోడించాను.

నా నమస్కారాన్ని, నన్ను గమనించే స్థితిలో ఆయన లేరని గోదారి అలలమీద నిలిపిన ఆయన తీక్షణ దృక్కులే చెప్తున్నాయి.

కాస్సేపటికి తపోభంగమైన తపస్విలా నా వైపు చూసి, గుబురు గడ్డం వెనుక చిందులాడే చిద్విలాసంతో –

**చలం :** ఎవరమ్మా నువ్వు! నన్నెలా గుర్తు పట్టావు?

**నేను :** స్వేచ్ఛగా వీచే గాలినెవరు గుర్తుపట్టలేరు? ఉధృతంగా వీచే తుఫానును ఎవరు గుర్తించలేరూ? మీ భావాలను, అనుభవాలను ఒక్కోసారి పిల్లవాయువులా, ఒక్కోసారి పెపు తుఫానులా వెల్లడించి మీ స్వేచ్ఛా రచనా మారుతంతో మమ్మల్ని ఓ వూపు వూపారు కదా! మిమ్మల్ని గుర్తించలేకపోతే మాలోని భానిస వాసనలను మేమే గుర్తుపట్టుకోలేని అసహాయ స్థితిలో వున్నట్లే.

**చలం :** నా రచనలని చూసి పారిపోయినట్లే, నాతో మాట్లాడటానికి కూడా వెనకడుగేసే వాళ్ళని చూసాను కానీ....... నువ్విలా... ధైర్యంగా.. ఆ ...... నువ్వింకా నా రచనల్ని పూర్తిగా చదివినట్టులేదు?

**నేను :** మీరన్నట్టు అన్నీ చదవలేదు కానీ..... అన్నం ఉడికిందో లేదో తెలియాలంటే ఒక్క మెతుకు పట్టుకుంటే చాలదా? నాకొకటనిపిస్తుందండీ!

మీ దృక్పథాన్నీ! వ్యక్తిత్వాన్నీ అంచనా వెయ్యాలనుకోవటం అనంత సాగరపుటంచులు చూడాలనుకోవటమే.

ఆ అంచు తెలియని కడలిని శోధించలేనట్లే మీ అసలు మనసు అంత తేలిగ్గా నా లాంటి మందమతులకు బోధపడదు.

స్త్రీ జనోద్ధారకుడిగా, స్త్రీ సమస్యా పరిష్కారకుడిగా నాకు ఓ మహా రచయితగా కనిపిస్తారు మీరు.

ఐనా! స్త్రీని అంగాంగ వర్ణన చేసి అశ్లీలంగా చిత్రించిన ప్రబంధాలకన్నా మీరు పెట్టిన స్త్రీ ఘోష–మెరుగే. ఓ సందేహం మాస్టారూ! మీరు అక్కడక్కడ ప్రదర్శించిన విచ్చలవిడి శృంగారం అంత అవసరమా?

**చలం :** ఆ.... అడగాల్సిన ప్రశ్నే అడిగావు.

నవరసాల్లో రసరాజమైన శృంగారం లోకాన్ని ఏలుతూ, స్త్రీ, పురుష బంధవ్యాలు పెక్కు భాదలకి పరిష్కారమవుతుంటాయి. అటువంటి అతీతమైన ప్రేమని పంచే స్త్రీని రెండో జాతిగా చూడొద్దని ఈ లోకాన్ని ప్రాధేయపడ్డాను.

పైగా.....ఆ రోజుల్లో కన్యాశుల్కం రాజ్యమేలేది. పురుషుడి విచ్చలవిడి శృంగార సంచారం ఓ ఘనతగా భావించే వాళ్ళమ్మా!

మరి స్త్రీ విషయానికొస్తే– స్త్రీని గడపదాటనీయకుండా, తెరచాటుగా బంధించిన నికృష్టపు రోజులు అవి.

అందుకె అటువంటి స్వేచ్ఛ స్త్రీలకుంటే ఎలా వుంటుందో? చూపించి ఈ సంఘాన్ని హడలగొట్టాలనుకున్నాను.

అందుకే ఈ వితండవాదన చేసాను-

**నేను :** మీ ఆలోచనే భయంకరమైందనీ స్త్రీలను, వివాహ వ్యవస్థనూ పెడతోవ పెడ్తున్నారనీ మిమ్మల్ని సంఘ పెద్దలే వెలివేశారు గదండీ!

**చలం :** అవునమ్మా! ఇప్పటిలా స్త్రీకి అప్పట్లో చదువు, ఉద్యోగాలు ఎక్కడివి. స్త్రీపైన పురుషుడి అంక్షలు ఎక్కువగా వుండేవి. పురుషాధిక్య సమాజమంటే ఏమిటో, ఇప్పటికన్నా ఆ కాలంలోనే ఎక్కువ చూడొచ్చు.

అప్పట్లో! నాకు స్త్రీ మీదున్న ఆంక్షలు చూస్తే ఒళ్ళు మండిపోయేది.

అందుకే! ఓరి బదుద్దాయి!ఎక్కువ అంక్షలు పెడితే నీ ఆడవాళ్ళు ఇంతేరా! అనిచెప్పాలనిపించేది.

అలా రాసానంతే.

నా రచనల్ని ఇప్పటి కాలంతో ఆలోచించి చూస్తే ఎలాగమ్మా!

స్త్రీలకు పురుషులంతా గొప్పగా ప్రేమించే హక్కుందనీ, అమె కేవలం పనికీ, పడక్కీ పరిమితమైన మరయంత్రం కాదనీ నేను చేసింది అప్పట్లో చెవిటిలోకం ముందు శంఖరావమే అయింది.

**నేను :** మీ రచనల వలన నేను మన ఆడవాళ్ళు ఎక్కడ ఎదురు తిరుగుతారో అని పురుషులు కాస్త భయపడ్డారు కానీ, మీరు స్త్రీ వదిలివెళ్ళిపోవడంచెప్పారే గాని, ఎదిరించడం చెప్పలేదు.

ఇది ఒక రకంగా స్త్రీ కన్నా పురుషుడికే ఎక్కువ స్వేచ్ఛ ఇచ్చినట్లవుతుంది. అందుకే నా లాంటి అభిమానులు మీకు స్త్రీలలోనే కాదు పురుషుల్లోనూ వున్నారండీ!

మీలోని తాత్వికుణ్ణి ఎవరోగాని అర్థం చేసుకోలేరు.

**చలం :** చూడమ్మా! ఆ సూర్యుణ్ణి చూస్తే.. అజ్ఞాన తిమిరాలు పటాపంచలై జ్ఞానోదయమౌతున్నట్లు లేదూ..... ఏదో కొత్త ఆశకి శ్రీకారం చుడుతున్నట్లుంది కదూ!

**నేను :** గురూజీ! మీ రచనలని సరిగ్గా లోతుగా అర్థం చేసుకుంటే ఎంతో కొంతైనా జ్ఞాన భాస్కరోదయం కాకపోదు. మీ రచనల్లో కొన్నిటి గురించి మీతో కాస్సేపు మాట్లాడాలని వుంది.

**చలం :** 'మందహాసం'

(ఆ మందహాసంలో.. 'ఓసి...! అమాయకురాలా! నాతో మాట్లాడేదేముంది? అమ్మపుట్టిల్లు సంగతి మేనమామ దగ్గరా అన్నట్లు నువ్వెంత అర్థం చేసుకున్నావో! అవేగా నువ్వు చెప్పేది అన్న భావాలెన్నో నాకు దర్శనమిచ్చి అన్నిటినీ వివరించే శక్తి, సాహసమూ లేక కొన్నే చెప్దామనుకున్నాను).

**నేను :** మీ 'ప్రేమ లేఖలు' నవలే నేను చదివిన మీ మొదటి నవల. ఈ నవల్లో ప్రేమని కాచివడపోసిన ఒక ఉత్కృష్ట ప్రేమైకజీవిగా ప్రేమ పిపాసిగా మీరు కన్పిస్తారు. మ్యూజింగ్స్‌లోనూ మిగతా నవలల్లో కూడా తత్వంతో తలపండిన తాత్వికుడిగా దర్శనమిస్తారు.

**చలం :** మహా మౌనిలా తన తలని ఓ సారి పైకి, క్రిందికీ వూపారు. అలాగా... అన్నట్లు!

**నేను :** మిమ్మల్ని, మీరచనల్ని విమర్శించేవాళ్ళకి మీరు మ్యూజింగ్స్‌లో రాసిన మాటలు.

వివాహమనే సంస్థను నిర్మూలం చెయ్యాలనే ఉద్దేశ్యంతో రాసానన్నారు. ఆ విమర్శ చదివి మళ్ళీ ఆ పుస్తకం తిరగవేసి చేసాను. నా కంటికి అట్లాంటి ప్రయత్నం కనబడట్లేదు.

నేను వాంచించే మార్పు ఈ వివాహంలో వున్న అక్రమాలు, అన్యాయాలు పోవాలనీ.

ఇలాగే అరుణ నవల్లో-

మనిద్దరం ఇట్లా విడిగా పడుకున్నామంటే.....ఈ అర్థరాత్రి యముడు నమ్ముతాడా! ఏం లేదని చిత్రగుప్తుడు సాక్ష్యం చెప్పినా సరే ........ లోకం మాట అటుంచి

ఇలాంటివి మీ రచనల్లో ఆణిముత్యాలెన్నో వుంటే అవి వదిలి మిగతావన్నీ పట్టుకు వేళ్ళాడతారే వీళ్ళు?

**చలం** : బాగుందమ్మా! పుర్రెకోబుద్ధి! జిహ్వకో రుచి అన్నట్లు అంతా నీలాగే ఆలోచించాలనెక్కడుందీ? ఎవరిష్టం వాళ్ళది అలాంటి వాళ్ళకోసమే అరుణాచలం వెళ్ళాక నా ఆలోచనల్ని కాస్త సవరించుకుందామనిపించింది.

**నేను** : మాస్టారూ! మీ రచనల్లో పతితుల, మనస్సు, ఆత్మలే గోచరిస్తాయి. పాఠకుల మనస్సే ముందు నిలబడి అంతరాత్మ గత భావాలను విప్పిచెప్పిట్లు అన్నీ వాస్తవాలే అన్నట్లు యదార్థత ప్రతిబింబిస్తూ వుంటుంది.

అందుకే మాష్టారూ! మీ రచనలలాగే మీరూ చిరంజీవులే –

**చలం** : ఇలా, ఆ రోజుల్లో ఈ ఆలోచన ధోరణే వుంటే, ఈ రాజమహేంద్రిలో అద్దె కొంప దొరక్క ఎవరూ ఇచ్చే సాహసం చెయ్యక నేనెందుకు బాధపడేవాణ్ణి.

**నేను** : చివరగా... చిన్నమాటండీ!

మీ ప్రేమ లేఖలు చదివి నా మిత్రుడు విజయ కుమార్ నాకు రాసిన లెటర్‌లో అన్న మాటలు నాకింకా జ్ఞాపకమే.

జీవిత సత్యాలను ఒకే మూటలో భద్రపరిచింది చలం 'ప్రేమ లేఖలు'.

ప్రేమకెంత ఉన్నతిని కల్పించాడు. ప్రేమకై ఎంత తపస్సు చేసాడో? అంత గొప్ప పుస్తకం లేదేమో అన్పిస్తుంది. అనుభూతులన్నింటికి అక్షర రూపం కల్పించీ, వెన్నెలను నదులుగా ప్రవహింపజేసి, నక్షత్రాలను పూలుగా మర్చి మేఘాల రథాల మీద ప్రేమ విశ్వాంతరాళాల్లో నిరాటంకంగా, నిర్భయంగా, నిర్విరామంగా ప్రయాణం చేసిన వ్యక్తి చలం.

చలం ప్రకృతిని వర్ణించిన తీరు అనితరసాధ్యమేనా అన్పించక మానదు ప్రకృతి సౌందర్య దాహం ఎంతటిదో తెలిపింది కదూ!

మన నిరంతర స్మరణం మనకున్న గొప్ప ఆభరణం నదులతో కలిసి జీవించడం పువ్వులతో కలిసి నవ్వడం.

**చలం** : అదో చూడు! అమీర్‌ని చేరని రాజేశ్వరి, ఇంకా నేనూహించిన ప్రేమని పొందలేని అరుణ దయనీయంగా నీళ్ళకోసం వస్తున్నారు. చలం పాత్రలు కాని వాళ్ళని అలా చూడలేను - వస్తాను.

(అంటూ గబగబా ముందుకు నడిచిపోయారు)

చలం కాలంనాటి స్త్రీలు ఒక వైపు, స్త్రీ శక్తి గురించిన కొత్త మహిళలు మరోవైపు, మధ్య నేను - ఈ గోదారి తీరాన అలాగే నిలుచుండిపోయాను.

చలం అడుగుల్లో రక్తస్పర్శని చూస్తూ....

**- పి. కోటేశ్వరమ్మ**

**(5-3-1989 ఆదివారం 'ఉదయం' దినపత్రికలో ముద్రితమైనది)**